## బాల్యం

ప్రస్తుతము పాకిస్తాన్‌లోనున్న పంజాబు రాష్ట్రములోని జోయా అను చిన్న గ్రామములో లక్ష్మీబాయ్, జవహర్‌మల్ దంపతులు నివసించుచుండిరి. ఒక దినము ఒక సాధువు వచ్చి లక్ష్మీబాయ్‌తో, "నీకు ఒక కుమారుడు జన్మించును గాని అతడు మీతో నివసించడు" అని చెప్పెను. సాధువు చెప్పిన ఈ మాటలను, లక్ష్మీబాయ్ మనస్సులో వుంచుకొని తలపోయుచుండెను. సాధువు చెప్పిన ప్రకారము ఆమె గర్భవతియై 1903వ సం॥ జూన్ 6వ తేదీన ఒక కుమారుని కనెను. అతనికి **భక్తసింగ్** అని పేరుపెట్టి, గురునానక్‌కు ప్రతిష్టించిరి. ఆ బిడ్డ పుట్టగానే పండుగ, వేడుకలు, ఆనందోత్సాహముతో జరుపుకొనిరి. ఈ బిడ్డ పుట్టినవార్త ఆ గ్రామములోని ప్రతి ఒక్కరికి, చుట్టు ప్రక్కల గ్రామస్థులకు వ్యాపించెను. దేవాలయములోను, గురుద్వారములోను ప్రత్యేకమైన పూజాకార్యక్రమములు చేసిరి, అయితే సాధువు చెప్పిన మాటలు జ్ఞాపకము చేసికొని, ఏదో ఒక దినమున భక్తసింగ్ ఇంటిలో నుండి పారిపోయి సాధువుగా మారునేమోనని భయపడుచుండిరి. కనుక వారు ఎంతో జాగ్రత్తగా బిడ్డను పెంచుచు, అతని నడకలను కనిపెట్టుచు, అడిగినదంతయు యిచ్చుచూ అల్లారు ముద్దుగా పెంచిరి. వారు బిడ్డకోరునది ఇవ్వకపోయినయెడల అలిగి ఇంటినుండి పారిపోవునేమోనని, అడిగినదంతయు ఇచ్చెడివారు. భక్తసింగ్‌కు ఐదుగురు సహోదరులు. ముగ్గురు సహోదరీలుండిరి. అయినను తల్లి భక్తసింగ్‌ను అందరికంటే ఎక్కువగా ప్రేమించెను. భక్తసింగ్ 12సం॥ల వయస్సులో తల్లిదండ్రులు తమ ప్రేమను వెల్లడిపరచుటకై కుమారుని జన్మ దినోత్సవమును బహుఘనముగా, ఆర్భాటముగా గ్రామస్థులనందరిని ఆహ్వానించి జరిపిరి. ఈ జన్మ దినోత్సవమును గురించి గ్రామస్థులు అనేక దినములు చెప్పుకొనిరి. చుట్టుప్రక్కల గ్రామములలో కూడా ఈ విషయము కారుచిచ్చువలె వ్యాపించినది. జవహర్‌మల్ కుటుంబమునకు ఉన్న ధనఘనతలను బట్టి దోపిడిదొంగల దృష్టి వీరిమీదపడినది. 1919వ సం॥లో బందిపోటు దొంగలు జవహర్‌మల్ కుటుంబముపై దాడిచేసి, జవహర్‌మల్‌ను గొడ్డలితో చంపుటకు ప్రయత్నించిరి. తన భర్తను దొంగలు గొడ్డలితో నరకబోవుచున్నారని లక్ష్మీబాయి గ్రహించి, బంగారము విలువగల సొత్తున్న బీరువా తాళపు చెవిని వారికి విసరివేసెను. దొంగలు తాళపు చెవి దొరకగానే జవహర్ మల్‌ను విడిచి బీరువా తీసి బంగారము, డబ్బు, విలువగల సొత్తునంతటిని తీసికొని రక్తము కారుచున్న జవహర్‌మల్‌ను చీకటిలో పారిపోయిరి. ఈ సంఘటన తరువాత జోయా గ్రామము తమకు సురక్షితము కాదని గ్రహించి జవహర్‌మల్ కుటుంబము 1920వ సం॥లో సర్గోదా అను పట్టణమునకు బయలుదేరి వెళ్ళిరి.

## ప్రార్థించు సిక్కు బాలుడు

చిన్న వయస్సు నుండియే భక్తసింగ్ దేవుని పై తృష్ణ కలిగియుండెను. ఇతర పిల్లలవలె వీధులలో ఆడుకొనుటకు అతనికి ఇష్టము లేకుండెను. అతడు ఒక చిన్న దేవాలయమునకు వెళ్ళి “ఓ దేవా! నీవు ఎక్కడ వున్నావు? నిన్ను ఏ రీతిగాకనుగొనవలెనో చెప్పుము” అని ఏడ్చుచు, ప్రార్థించుచుండెను. కాని దేవుడు అతనికి కోట్ల మైళ్ళదూరములో నున్నట్లుండెను. భక్తసింగ్‌కు సజీవమైన దేవుని ఎరుగవలెనను కోరిక ఎంతో గాఢముగా నుండెను. తరచుగా తాను ఒక ఎత్తైన కొండను ఎక్కుచున్నట్లు ఒక కలను కనుచుండెను. మరియు ఎంతో కష్టముతోను, ప్రయాసముతోను, దాని శిఖరమును చేరును, ఆ శిఖరమును చేరగానే ఎవరో అతనికి క్రిందికి పడద్రోయుదురు. శిఖరముపై నుండి క్రిందకి పడునప్పుడు వాడియైన మొనలు గల రాళ్ళు, ప్రక్కటెముకలలో గ్రుచ్చుకొనుచూ, దాని వలన బాధ, నొప్పి కలిగి, కలలో గట్టిగా ఏడ్చును. కాని కొండపై నుండి క్రింద పడినప్పుడు మొత్తగానున్న పట్టు తివాసీల మీద పడును. అప్పుడు పరలోక సుఖములతో నున్నట్లుండెను. క్రిందపడినప్పుడు, అనుభవించిన సుఖము, ఆనందమును తలంచినప్పుడు కొండపై నుండి పడినప్పుడు పొందిన బాధలు లాభకరముగా అనిపించెను. తొమ్మిది సం॥ల వయస్సులో అతడు పదేపదే ఈ కలను కనుచుండెను. బాల్యము నుండియే

భక్తసింగ్ సిక్కుమతము యెడల ఎంతో భయభక్తులు కలిగియున్నందున క్రీస్తుయొక్క సువార్తకు బద్ధశత్రువుగా నుండెను. పంజాబ్‌లోని మిషన్ స్కూల్‌లో 7 సంవత్సరములు చదువుకొనినప్పటికిని క్రీస్తును గురించి తెలిసికొనటకు ఏ మాత్రము ఆసక్తి కనపరచలేదు. పాఠశాలలో చదువుతున్న అనేకమంది విద్యార్థులవలె తాను కూడా క్రైస్తవులను ద్వేషించి, బైబిలు బోధించువారిని ఎగతాళి చేయుచుండెను.

## బహుమతిగా బైబిల్

ఇంటర్మీడియట్ పరీక్షలలో ఉత్తీర్ణుడైన పిమ్మట, ఒక సుందరమైన పరిశుద్ధ గ్రంథము భక్తసింగ్‌కు బహుమానముగా నిచ్చిరి.

## బైబిలును చింపుట

భక్తసింగ్, బైబిలు కవరు చక్కగా నున్నందున దానిని ఉంచుకొని, బైబిలును చించివేసెను. పాఠశాల కళాశాల దినములలో భక్తసింగ్ క్రీస్తు సువార్తకు బద్ధ శత్రువుగా జీవించెను. ఎంతో మతభక్తి కలిగి సిక్కుల దేవాలయములో మతాచారములను పాటించుచు, అనేక గంటలు గడుపుచుండెను. సిక్కమతస్థులు సాంఘీక సేవ చేయువారు గనుక తాను కూడా ఇతరులకు సహాయము చేయుటలో పాలు పొందుచుండెను. అయినను అతనికి, తాను వెదకుచ్చు నిజమైన సంతోషము, సమాధానము దొరకలేదు. భక్తసింగ్ 7 సం॥ల వయస్సులో నున్నప్పుడు తన తండ్రి

పని జరుగుచున్న స్థలమునకు తీసికొని వెళ్ళి, ఆ పనిని పర్యవేక్షించు ఆంగ్లేయ ఇంజనీరుకు పరిచయము చేసెను. ఆ ఇంజనీరు భక్తసింగ్ తండ్రితో "నీ కుమారుని ఎందుకు ఇంగ్లండుకు పంపకూడదని" అడుగగా, తండ్రి "అతడు చాలా చిన్నవాడు, ముక్కు తుడుచుకొనుట కూడా అతనికి తెలియదు" అని చెప్పెను. అప్పుడా ఇంజనీరు అతని తండ్రితో అతడు ఇంగ్లండుకు వెళ్ళిన, అతనిని తన భార్య పరామర్శించునని చెప్పెను. అతడు తమాషాగా చెప్పలేదు గాని నిజముగానే చెప్పెను. ఇంకను ఆ ఇంజనీరు భక్తసింగ్ తండ్రితో, "ఇతడు ఇంగ్లండు నుండి తిరిగి వచ్చిన తరువాత బలమైన బ్రాహ్మణత్వమును క్రిందికి పడగొట్టగలడు" అని చెప్పెను. ఆ ఇంజనీరు తమాషాగా మాట్లాడుచున్నాడని భక్తసింగ్ తండ్రి నవ్వుకొనెను. అయితే ఆ మాటలు భక్తసింగ్ మనస్సులో నాటుకొని, తప్పకుండా ఇంగ్లండుకు వెళ్ళవలెనని ఆశించెను. అప్పటినుండి "నేను పెద్దవాడనైన తరువాత ఇంగ్లండు వెళ్ళెదను" అని అందరితో చెప్పుచుండెను. 14 సంవత్సరముల వయస్సులో ఉన్నత పాఠశాలకు వెళ్ళినప్పుడు అతడు ఇంగ్లండులోని విశ్వవిద్యాలయములతో ఉత్తర ప్రత్యుత్తరములు ప్రారంభించెను. ఇంగ్లండుకు వెళ్ళవలెనను బలమైన కోరిక వుండుట చేత 30 విశ్వ విద్యాలయముల ముఖ్యాంశముల ప్రకటనలను(ప్రాస్పెక్టస్) తెప్పించుకొనెను. భక్తసింగ్ ఇంగ్లండుకు వెళ్ళుట తండ్రికి ఏ మాత్రము ఇష్టములేదు.

తన వ్యాపారములో సహాయపడిన యెడల ఎంతో డబ్బు ఇచ్చెదనని భక్తసింగ్‌తో చెప్పెను. అతడు ఒక పత్తి పరిశ్రమను స్థాపించెను. గనుక తనతో పాటుతన జ్యేష్ఠ కుమారుడైన భక్తసింగ్ సహాయపడునని ఆశించెను. అయితే భక్తసింగ్ తప్పకుండా ఇంగ్లండునకు వెళ్ళవలెనను కోరిక గలిగియుండెను. బి.ఎ. ముగించిన పిదప తండ్రి తనను ఇంగ్లండుకు పంపనందున ఎంతో విచారముగానుండెను. ఒక దినమున తల్లి అతనితో "నీవు ఇంగ్లండు వెళ్ళుటకు నేను సహాయము చేసెదను గాని అచ్చటకు వెళ్ళిన యౌవనస్థులు తమ స్వంత మతమును విడిచిపెట్టుదురని వింటిని కనుక "నేను మతమును ఎంతమాత్రము విడిచిపెట్టనని ప్రమాణము చేయుమనె" ను. భక్తసింగ్ తన తల్లితో "నా మతమును విడచిపెట్టుదునని నీవు నమ్ముచున్నావా?" అనెను. ఆ దినములయందు తన సిక్కుమతమును గురించిన అతడు బహుగా అతిశయపడు చుండెను. తన మతము యెడల తనకు కలిగన భక్తి విశ్వాసములను గురించి తల్లిని ఒప్పించుట వలన భక్తసింగ్ ను ఇంగ్లండుకు పంపుటకు తండ్రిని ఒప్పించెను. తండ్రి వ్యాపారస్థుడు గనుక డబ్బు గురించి, తల్లి భక్తిగలది గనుక మతమును గురించి తలంచిరి. కాని ఈ యౌవన సిక్కుమతస్థుని రక్షణార్థమై దేవుని హస్తము తల్లిదండ్రుల ద్వారా కార్యము చేయుచుండెను.

## యౌవన సిక్కు మతస్థుడు

1926 సం॥ సెప్టెంబరు నెలలో భక్తసింగ్ ఇంగ్లండులోని లండన్ నగరమునకు వచ్చి మెకానికల్ ఇంజనీరింగ్ కోర్సునందు చేరెను. ఇంగ్లండునందు మొదట మూడునెలలు తన మతమునకు ఎంతో నమ్మకస్థుడైన యుండెను. సిక్కుల ఆచారము ననుసరించి శరీరమందలి వెంట్రుకలను కత్తిరించు కొనకూడదని తన పొడవైన తల వెంట్రుకలను, గడ్డమును కత్తిరించుకొనలేదు. కొంత కాలమైన పిమ్మట పొడవైన తలవెంట్రుకలు, గడ్డము కలిగియుండుటపై నమ్మకమును కోల్పోయి, వెంట్రుకలను కత్తిరించుకొని, గడ్డము క్షౌరము చేసికొనెను. తర్వాత నాస్తికునిగాను. సోషలిస్టుగాను మారి, స్వేచ్ఛా జీవిగా ఆలోచించుట మొదలిడెను. సిక్కు మతస్థుడుగా ఎన్నడూ సిగరెట్టు త్రాగకపోయినను, ఇప్పుడు త్రాగనారంభించెను. చాలా ఖరీదైన సిగరెట్లనుకొని, దాని కొరకై బంగారు సిగరెట్టుపెట్టెను కొనెను. ఈ బంగారు సిగరెట్టుపెట్టెను అందరికి చూపించి గర్వించుచుండెను. దీని తరువాత మద్యపానమును నేర్చుకొనెను. ఎంతో వెలగల వస్త్రములు ధరించుచుండెను. ఎంతో కష్టపడి పాశ్చాత్యుల అలవాట్లన్నింటిని నేర్చుకొనెను. వారి భోజనము అంతగా నచ్చకపోయినను, కత్తి మరియు ముండ్లగరిటెతో తినుటకు నేర్చుకొనెను. సినిమాలకు, నాట్య గృహములకు, క్రమముగా వెళ్ళుచు, పాశ్చాత్యుల అలవాట్లనన్నింటిని అనుకరించి, వారివలె జీవించుట నేర్చుకొనెను. ఈ విధముగా రెండు సంవత్సరములు గడిపెను.

## ఓడ

1928 సం॥ ఆగస్టు 8వ తేదీన భక్తసింగ్ వేసవి కాలపు సెలవు దినములను గడుపుటకు "యస్.మస్, మాంట్‌క్లామ్" అనే ఓడ ద్వారా కెనడాకు వెళ్ళెను. అతడు తాను ఏ విధానములోను పాశ్చత్య దేశస్థునికంటే తక్కువకాదని ఋజువు చేయుటకు ఓడలో జరుగు ప్రతికార్యములోను పాలుపొందవలెనని తీర్మానించుకొనెను. తాను లండనులో నేర్చుకొనిన వాటినిబట్టి అతిశయించు నిమిత్తము, అన్ని రకములైన కార్యములు అనగా ఆటలు, త్రాగుట, పేకాట ఆడుట,పొగత్రాగుట, నాట్యము మొదలగు వాటియందు పాలుపొందుచుండెను. ఆగస్టు 11వ తేది, ఆదివారము ఉదయమున ఓడలో నోటీసు బోర్డుమీద "ఉదయము 10 గం॥లకు మొదటి తరగతి భోజనపు గదిలో క్రైస్తవ ఆరాధన జరుగును" అని వ్రాసి యుండుట చూచెను. ఆ దినము వరకు అతడు క్రైస్తవ ఆరాధనకు గాని, కూడికకు గాని ఎప్పుడు హాజరుకాలేదు. వాస్తవము చెప్పవలెననిన, అతడు బైబిలును, క్రైస్తవ కార్యక్రమములను ద్వేషించెడివాడు. తాను ఒక వేళ ఈ క్రైస్తవ ఆరాధనకు హాజరుకాని యెడల తన స్నేహితులు, ఇతడు సంకుచితమైన మనస్సుగల హైందవుడని తలంచెదరు గనుక తానుహాజరు కావలెనని తీర్మానించుకొనెను.

## ఓడలో ఆరాధన జరుగుట

భక్తసింగ్‌కు బైబిలు మీదగాని, బైబిలు బోధమీద గాని ఎటువంటి ఆసక్తిలేదు. అయితే తనసహోచరులు చేయువాటినన్నిటిని చేయుచున్నట్లు కనబరుచుటకు క్రైస్తవ ఆరాధనకువెళ్ళి అక్కడ చివరివరుసలో ఒక స్థలమును ఆక్రమించెను. వారందరు పాటలు పాడుటకు నిలువబడినప్పుడు తాను కూడ నిలువబడెను, వారు కూర్చున్నప్పుడు తానుకూడ కూర్చుండెను. అక్కడ ప్రసంగీకుడు మాటలాడనారంభించగా అతడు నిద్రించెను. మరియు అతడు ఇట్లనుకొనెను. "నాకు వారి బోధలయందు ఎంత మాత్రమును ఆసక్తిలేదు. కెవలము నేనుకూడ ఎక్కడికైనను వెళ్ళగలను అని చూపించుకొనుటకు మాత్రమే వచ్చితిని" ఆరాధన అంతమున వారందరూ ప్రార్థించుటకు మోకరించిరి గాని అతడు ఒక్కడు మాత్రమే కుర్చీపై కూర్చుండెను. అతడు తన దేశమునకు గాని, తన మతమునకు గాని, చెందని ప్రజలతో ఎంత మాత్రమును మోకరించకూడదని తలంచెను. "వారు నా దేశమును తన స్వలాభము కొరకు వుపయోగించుకొనిరి. వారు తిని త్రాగుటను చూచితిని, వారికేమి తెలియును? నా మతమే గొప్ప మతము" అని భావించెను. కావున తనజాతి పరమైన జ్ఞానపరమైన మతపరమైన గర్వము అతనిని మోకరించకుండ ఆటంకపరచెను. అతడు బయటకునడిచి వెళ్ళిపోవలెనని అనుకొనెను గాని వారందరు మోకరించి ప్రార్థించుచుండగా, ఎంతోకష్టముగా అక్కడే కూర్చుండెను.

అతడు బయటకు ప్రయత్నించెను. అయితే అదిఅసాధ్యము ఎందుకనగా అనేక మంది ప్రజలు తనకు ఇరు ప్రక్కల మోకరించియుండగా, వారిని కలవరపరచుటకు మంచిది కాదని తలంచెను. పిమ్మట తాను యిట్లనుకొనెను. "నేను మహమ్మదీయుల మసీదుకు, హిందూ దేవాలయములకు వెళ్ళినపుడు నా చెప్పులు విప్పి నా కాళ్ళు కడుగుకొని వారి స్థలముల యెడల నా గౌరవమును కనబరచితిని, నేను మర్యాద కొరకైన ఈ స్థలమును ఘనపరచవలెను" కావున మర్యాద కొరకు తన గర్వమును జయించి మర్యాదగా మోకరించెను.

## యేసుప్రభువా.... నమ్ముచున్నాను...

భక్తసింగ్ మోకరించిన తక్షణమే, ఏదో ఒకదైవికశక్తి తనను ఆవరించునట్లు అనుభవించి **"యేసుప్రభువా, నీవే సజీవుడవైన క్రీస్తువని ఎరిగి, నమ్ముచున్నాను"** అను మాటలు పలికెను. ఈ మాటలనే అతడు పదే పదే పలుకుచుండెను. నిజముగా, అప్పటి వరకు అతడు ఒక నాస్తికుడు, మరియు తన బుద్ధిహీనతను బట్టి తరుచుగా దేవుడు లేడని చెప్పుచుండెను. అయితే ఆ దినమునుండి **"సజీవుడైన క్రీస్తు"** అను మాటలు అతని జీవితములో ఎంతో వాస్తవముగా నుండెను. ఆ అనుభవముగల యేసుప్రభువు గూర్చి మరి అధికముగా తెలుసుకొనవలెనను బలమైన వాంఛను కలిగియుండెను. మొదటిగా తాను గమనించదగిన మార్పు ఏమనగా, తన

హృదయము గొప్ప ఆనందముతో నింపబడెను, రెండవదిగా, తాను యేసు ప్రభువు యొక్క నామమును పదే పదే పలుకుచుండెను. తనకు **"యేసుప్రభువు"** అను నామము ఎంతో మధురముగా నుండెను. మునుపు అదే నామమును తృణీకరించుచు, ఆయా చర్చలు, సంభాషణలలో, ఆ నామమును ఎగతాళి చేయుచుండెను. తాను కనుగొనిన మరొక మార్పు ఏమనగా, ఐరోపా వారు, తనను కూడా వారిలో ఒకనిగా భావంచెను. సహో.భక్తసింగ్ కెనడాలో మూడు నెలలు గడిపెను. 1929వ సం॥లో వ్యవసాయ ఇంజనీరింగ్‌లో తన తర్ఫీదును ముగించుటకు, తిరిగి కెనడాకు రెండవసారి వెళ్ళెను. ఆ సమయములో అతడు మానిటోబాలోని విన్నిపెగ్‌లో వై.యమ్.సి.ఎ.లో ఉండెను. అక్కడ బ్యాంక్ మేనేజర్‌గా పనిచేయుచున్న ఓవెల్ హన్‌సెన్ అను స్నేహితుని కలిసికొనెను. అతిన ముఖము ఎంతో ప్రకాశించుచుండెను గనుక సహో.భక్తసింగ్ హన్‌సన్‌ను, "నీకు సంతోషకరమైన అనుభవమేమ"ని అడిగెను అప్పుడు హన్‌సెన్ **ప్రభువైన యేసుక్రీస్తు తన వ్యక్తిగత రక్షకునిగాను, ప్రభువుగాను అంగీకరించుటే సంతోషకరమైన అనుభవమని ప్రత్యుత్తరమిచ్చెను.** అప్పుడు సహో.భక్తసింగ్ తనకు ఒక బైబిలును యివ్వమని మనవిచేసెను. హన్‌సన్ అతని మనవిని ఎంతో ఆశ్చర్యముతో "నీవు ఒక హైందవుడవు మరియు భారతీయుడవు, నీవు బైబిలు చదువవలెనని

కోరుచున్నావా? హైందవులు బైబిలు చదువరని నేను వింటిని" అనెను. అప్పుడు సహో. భక్తసింగ్ "నీవు చెప్పునది నిజమే. **ఈ చేతులే బైబిలును చింపినవి. ఈ పెదవులే క్రీస్తును దూషించినవి.** అయితే గత 18 నెలల నుండి యేసుప్రభువు యెడల గొప్ప ప్రేమను కలిగియుంటిని. ఆ నామమునే ఎంతో ప్రేమించుచున్నాను. ఆ నామము నాకెంతో మధురముగా నున్నది. అయితే ఇంత వరకు ఆయన జీవితము, మరియు బోధను గురించి ఏమియు ఎరుగను" అని ప్రత్యుత్తరమిచ్చెను. పిమ్మట సహో.భక్తసింగ్ అతనికి ఓడలో తనకు కలిగిన అనుభవమును గురించి చెప్పి, సజీవుడైన ప్రభువైన యేసుక్రీస్తును గురించి, మరి అధికముగా తెలిసికొనవలెనను కోరిక గలదని వెల్లడిచేసెను. గనుక హన్‌సెన్ ఇంగ్లీషు భాషలో ఒక చిన్న క్రొత్త నిబంధన బైబిలును యిచ్చెను. అదే రాత్రి 1929వ సం॥ము డిశంబరు 14 వ తేదిన మొదటి సువార్తలో మొదటి అధ్యాయమును చదువనారంభించెను. ఉదయము 3గం॥ల వరకు దేవుని వాక్యమును ఎంతో ఆసక్తిగా చదువు చుండెను. ఉదయమున నేలంతయు మంచుతో కప్పబడి యుండుటను చూచి, పగలంతయు తన గదిలోనే ఉండి చదువు చుండెను. ఆ రీతిగా తాను ఎడతెగకుండా మూడుదినములు చదివి అట్టి గ్రంథమును ఏ మనుష్యుడు వ్రాయలేదని సంపూర్ణముగా ఒప్పించబడెను. మరియు అది దైవగ్రంథమనియు, దానిని ఎంతోభక్తితో చదువవలెననియు తలంచెను. మూడవదినమున 1929వ సం॥ము డిశంబరు

16వ తేదీన సహో.భక్తసింగ్ యోహాను సువార్త చదువుచు, 3వ అధ్యాయము 3వ వచనమునకు వచ్చినపుడు ఇక ముందుకు వెళ్ళలేకపోయెను. **"నీతో నిశ్చయముగా చెప్పుచున్నాను"** అను మాటలు అతనిని ఒప్పించెను. కేవలము ఈ మాటలు చదువచుండగా అతని హృదయము వేగముగా కొట్టనారంభించెను. అతడు తన ప్రక్కన ఎవరో ఒకరు నిలువబడి "నీతో నిశ్చయముగా చెప్పుచున్నాను" అను మాటలు పదే పదే తనతో చెప్పుచున్నట్లు అనుభవించెను. అతడు ఎల్లప్పుడు బైబిలు ఐరోపా వారికి, అమెరికా వారికి చెందినది. అయితే భారతీయులకు వారి స్వంత పవిత్ర గ్రంథములు కలవని తలంచెను అయితే ప్రభువైన యేసుక్రీస్తు మెల్లనిస్వరము ఈ గ్రంథము బైబిలు, తనకు కూడా చెందినదని గ్రహింపజేసెను. ఆ స్వరమును విని, ఆయన మోకరించి ఇట్లనెను. **"ప్రభువా, అట్లయినయెడల నేనుఘోరపాపిని. నేను బైబిలును చింపివేసితిని, మరియు మిమ్ములను, మీ వాక్యమును వ్యతిరేకించి, దూషణమాటలు పలికితిని, గత అనేక సంవత్సరములు, అవమానకరమైన జీవితమును జీవించితిని. నా వంటి మనిషికి ఏమైనా నిరీక్షణ గలదా?** అప్పుడు ప్రభువైన యేసుక్రీస్తు. తన పాపములన్నిటిని బయలురచగా తన దేహము నల్లటి మచ్చలతో కప్పబడి వాటి నుండి చెడు వాసన వచ్చుచుండునట్లు కనుగొనెను. అప్పుడు ఒక స్వరము **"భక్తసింగ్, నీకు వచ్చుచున్న చెడువాసన మరియు నీవు చూచుచున్న నల్లటి మచ్చలు నీ పాపముల వలననే"** అని చెప్పుచుండెను. కావున అతడు "ప్రభువా, అది నిజమే, నేను ఈ పాపములను చేసితి. నాకు ధనము కలదు గాని సమాధానము లేదు. నాకు విద్యకలదు గాని నా జీవితమే ఒక ఓటమి" అని చెప్పెను తన పాఠశాల, కళాశాలలోనున్న దినములలో చేసిన పాపములన్నియు తన ముందుకు వచ్చెను. సహో.భక్తసింగ్ కన్నీరు చెక్కిళ్ళ మీదుగా కారుచుండగా **"ఓ ప్రభువా, నన్ను క్షమించుము. నిజముగా నేను ఘోరపాపిని. ఘోరపాపినైన నాకు ఏ నిరీక్షణ లేదు"** అని చెప్పెను. అతడు ఏడ్చుచుండగా తిరిగి **"ఇది నీ నిమిత్తమై విడువబడిన నా శరీరము, ఇది నీపాపముల నిమిత్తమై చిందింపబడిన నా రక్తము వెళ్ళుము, నీ పాపములు క్షమించబడెను"** అను స్వరము వినబడెను. అందుకు ప్రత్యుత్తరముగా అతడు ఇట్లు చెప్పెను. **"ప్రభువా, ఈ మాటలు నా గ్రహ్యమునకు మించినవి"** అది ఎట్లు అని తెలియలేదు, గాని యేసుక్రీస్తు రక్తమే తనను రక్షించెనని విశ్వసించెను.

అతడు ఈ సత్యమును వివరించలేకపోయెను గాని సంతోషము, సమాధానము తన హృదయములోనికి వచ్చెను. తన పాపములన్నియు క్షమింపబడినవని నిశ్చయత కలిగెను. మరియు ప్రభువైన యేసుక్రీస్తు తన హృదయములో ఏలుచున్నాడని ఎరిగెను. 1929 సం॥ డిశంబరు 16వ తేదీ, ఉదయము 11:30 ని॥లకు సమస్త జ్ఞానమునకు మించిన దేవుని సమాధానముచే ఆయన హృదయము నింపబడెను. మరియు **చెప్పశక్యమును మహిమాయుక్తమైన** సంతోషము

అతని అనుభవమాయెను. అతడు ప్రభువును స్తుతించుచు ఉండెను.

## యౌవనక్రైస్తవుడు

ఒకప్పుడు అజ్ఞానమును బట్టి తాను ద్వేషించిన ప్రభువైన యేసుక్రీస్తు తన శ్రేష్ఠమిత్రుడయ్యెను. తాను తృణీకరించి మరియు కాల్చివేసిన బైబిలు తనకు శ్రేష్ఠ గ్రంథమయ్యెను. ఇప్పుడు ప్రభువు తన మహిమ కొరకు అనేకులను నీతిమార్గమునకు నడిపించుటకు భక్తసింగ్‌ను తాను ఏర్పరచుకొనిన పాత్రగా సిద్ధపరచుచున్నాడు. నీవు ఈ పాపక్షమాపణ అనుభవమును పొందితివా? ప్రభువైన యేసుక్రీస్తు నీ నిమిత్తము మరణించెను. ఆయన నీ అతిక్రమములనుబట్టి గాయపరచబడెను. ఆయన దోషములను బట్టి నలుగగొట్టబడెను. నీ పాపశిక్ష ఆయనమీద మోపబడెను. ఆయన నీ పాపముల నిమిత్తము మరణించెను. ఆయన మూడవ దినమున తిరిగి లేచెను. ఈ దినము ఆయన నీతో మాటలాడుచున్నాడు. **"ఒకడు క్రొత్తగా జన్మించితే గాని అతడు దేవుని రాజ్యమును చూడలేడని నీతో నిశ్చయముగా చెప్పుచున్నాను"** నీవు ఉన్నపాటున ఆయన యొద్దకు వచ్చి, నీ పాపముల విషయమైన పశ్చాత్తపడి, నీ పాపములను తన రక్తముతో కడుగుమని యేసుప్రభువును వేడుకొనుము. అప్పుడు సహో.భక్తసింగ్ ఆ జ్ఞాపకార్థ దినమున, 1929వ సం॥ డిశంబరు16వ తేదిన పొందినట్లు నీవుకూడా ఆ అద్భుతమైన సమాధానమును, సంతోషమును పొందగలవు.

1932, ఫిబ్రవరి నెలలో ఒక ఆదివారము ఉదయమున సహో.భక్తసింగ్ బైబిలు చదువుచుండెను. "ఆ సమయమున యోహాను చేత బాప్తిస్మము పొందుటకు యేసు గలలియ నుండి యొర్దాను దగ్గరనున్న యోహాను యొద్దకు వచ్చెను" అని మత్తయి 3:13లో నున్న వచనము ద్వారా తానుకూడా బాప్తిస్మము పొందవలెనని ప్రభువు స్పష్టముగా మాట్లాడెను. నీవు నీ రక్షకునికంటె ఏ విధముననైనను శ్రేష్ఠుడవా? అని దేవుడు, సహో.భక్తసింగ్‌ను ప్రశ్నించెను. అందుకు అతడు "నేనెప్పుడును అలాగనలేదు" అని జవాబిచ్చెను. అయితే "బాప్తిస్మము విషమమేమి"యని ప్రభువడిగెను. తాను రక్షింపబడి, అనేక స్థలములలో సాక్ష్యమిచ్చుచుండెను. గనుక బాప్తిస్మము ప్రాముఖ్యమని తలంచలేదు. ప్రభువు, బాప్తిస్మము తీసుకొనవలసిన అవసరము లేనప్పటికిని, తన నిమిత్తము బాప్తిస్మమునందు సాక్ష్యమిచ్చెనని స్పష్టముగా తెలియజేసెను. అతడు మరుసటి దినమే బాప్తిస్మము తీసికొనెను. అది 1932 సం॥ ఫిబ్రవరి నాల్గవ తేది. ఆ దినము నుండి అతనికి బైబిలు నూతనగ్రంథమాయెను. అప్పటి నుండి ప్రార్థనయందు, సాక్ష్యమిచ్చుటయందు స్వతంత్రతను అనుభవించెను. సమస్తము అతనికి క్రొత్తవాయెను. సహో.భక్తసింగ్ తండ్రి తనకవసరమైన ఖర్చంతటి కొరకు డబ్బు సక్రమముగా పంపుచుండెను. అతడు రక్షింపబడిన తరువాత, తండ్రి పంజాబు హైకోర్టులో పెద్దకేసు కలిగియుండిన కారణమున భక్తసింగ్‌కు డబ్బు పంపించలేకపోయెను. భక్తసింగ్ పరదేశి,

అతనికి స్నేహితులు లేరు కనుక. ఏ మానవుని యొద్దకు సహాయము కొరకు వెళ్ళకూడదని తీర్మానించుకొనెను. అతడు ఉదయముననే లేచి ఉద్యోగము నిమిత్తము అనేక దుకాణములో, కర్మాగారములలో, కంపెనీలలో అడుగుచుండెను. ఆ సంవత్సరము కఠినమైన కరవు సంవత్సరముగా నుండెను. హాన్సెన్, సహో భక్తసింగ్‌ను, హేవర్డ్ అను దంపతులకు పరిచయము చేసెను. ప్రభువు వీరి ద్వారా సహో. భక్తసింగ్ ను పరామర్శించి అతని అవసరములను తీర్చెను. వారు అతనిని తమ కుమారునివలె పరామర్శించిరి. వారియొద్ద అతడు మూడు సంవత్సరములుండెను. సహో. భక్తసింగ్ కొన్నిదినములు వంటపని చేసెను. తరువాత రెండుదినములు టోరంటోలో పోలీసు ఉద్యోగము చేసెను. వారు అతనికి జీతమివ్వలేదు గాని టిక్కెట్టుకు మాత్రమే డబ్బులిచ్చిరి. ఆ గొప్ప పట్టణమందు కొంత డబ్బుతో ఉండవలవలసివచ్చెను. కాని తన యొద్దనున్న చిల్లర పైసలతో ఒక చిన్న కోకో ప్యాకెట్‌ను కొనెను.

## కొళాయి, కోకోప్యాకెట్

ఈ కోకో పొడిని స్నానపు గదిలోని వేడినీటిలో కలిపి చక్కెర లేకుండా ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము త్రాగుచుండెను. ఒక కర్మాగారములో పనిచేసి బాగుగా అలసిపోయి, తిరిగి వచ్చుచుండెను. అయినను పది దినములు ఈ చిన్న కోకో ప్యాకెట్ మీదనే ఆధారపడెను.

దేవుడు తనను ఒక ఉద్ధేశముతో దేనికొరకో సిద్ధపరచుచున్నాడని గ్రహించెను. తన యొద్ద బస్సుఛార్జీలేని కారణంమున అనేక మైళ్ళు కర్మాగారమునకు నడిచి వెళ్ళి వచ్చినప్పటికిని, అవి ఎంతో సంతోషకరమైన దినములుగా నుండెను. ఆ దినములు గుర్తు చేసుకొనినప్పుడు దేవునియెడల కృతజ్ఞతతో నిండిపోవుచుండెను. ఎందుకనగా ఆ శ్రమలు అతనిని ప్రభువునకు మరింత సమీపముగాతెచ్చెను. సహో. భక్త సింగ్ 1931సం॥లో టోరంటోలో శిక్షణలో నుండెను. బస్సు ఛార్జీలులేనందున ఉదయముననే లేచి తాను పని చేయు స్థలమునకు చాలా దూరము నడచి వెళ్ళు చుండెను. భోజనమునకు కూడా డబ్బులేదు. వాతారణము బహుచల్లగానుండెను. చలినుండి కాపాడుకొనుటకు ఉన్ని వస్త్రములు కూడా లేవు. మరియు నిస్సహాయముగా చలిలో వణకుచు వెళ్ళుచుండగా ఒక చర్చి భవనముపై దృష్టిపడెను.

## చర్చి భవనము

ఆ చర్చి గోడమీద **"తాను శోధింపబడు వారికిని సహాయము చేయగలవాడైయున్నాడు"** (హెబ్రీ 2:18) అను మాటలు కనబడెను. శోధింపబడు వారికిని సహాయము చేయు గలవాడైయున్నాడు. సహో భక్తసింగ్‌కు ఆ సమయములో హెబ్రీ పత్రిక గురించి ఏమి తెలియదు. కాని ఆ వచనమును పదే పదే వల్లించుచుండెను. ఆ వచనమునకు అర్ధము కూడా తెలియకపోయినప్పటికి తన దుఃఖము తీసివేయుటకు ఆ

వచనమెంత సహాయపడెను. అతడు ఆనందముతో తన హృదయములో పాడుకొనుచు కర్మాగారమునకు వెళ్ళెను. దినమంతయు ఆ వచనమునే జ్ఞాపకము చేసికొనుచు పనిచేసెను. కఠినమైన శ్రమలలో సహితము ఈ మాటలు అతనికి ఎంతో ప్రోత్సాహము నిచ్చెను. సహో. భక్తసింగ్ చినిగిన బూట్లతో ఎన్నో మైళ్ళు నడవలసియుండెను. తనకు ఒకజత బూట్లనీయమని దేవుని ప్రార్థించెను. ఆ దినమున ఒక మనిషిని చూచుటకు పాత బూట్లను పాలిష్ చేసికొని వెళ్ళెను. అప్పుడు సంభాషణ మధ్యలో ఆ పెద్దమనిషి "ఒక వ్యక్తి ఒక జత క్రొత్త బూట్లను కొనుటకు సరిపోవు డబ్బు యిచ్చెను. నేను నీకు క్రొత్త బూట్లను యిచ్చిన యెడల ఏమి అనుకొనకుము దయచేసి కాదనక తీసుకొను'మని చెప్పెను ఈ విధముగా దేవుడతని అక్కరలన్నిటిని తీర్చెను. ఒక ఉదయకాలమున సహో. భక్తసింగ్ తన తల్లికి ఉత్తరము వ్రాయవలెనని బలవంతపెట్టబడెను. అయితే కార్డుగాని, స్టాంప్గాని కొనుటకు డబ్బులేదు. అప్పుడు దేవా! నా తల్లి నన్ను గురించి చింతించుచున్నదని నమ్ముచున్నాను. ఆమెకు ఒక ఉత్తరము వ్రాయలనుకొనుచున్నాను. కాని స్టాంపుకొరకు, కార్డుకొరకు డబ్బులేదు" అని మోకరించి ప్రార్థించెను. తరువాత మోకాళ్ళపై నుండి లేచి తన జేబులో తడుముకొనగా ఒక చిన్న నాణెమును కనుగొనెను. ఈ నాణెము స్టాంపుకొనుటకు సరిపోవునో లేదోనని సందేహించుచు ఒక పిల్లవానిని పిలిచి స్టాంపు కొని తీసుకొనిరమ్మని పంపెను.

## సహో. భక్తసింగ్ మరియు ఇంగ్లీషు స్త్రీ

ఒక స్త్రీ, సహో. భక్తసింగ్ దగ్గరకు వచ్చి ఆ పిల్లవానికి ఆ నాణెము నెందుకిచ్చితివని గట్టిగా ప్రశ్నించెను. అతడు ఆమెకు క్షమాపణ చెప్పుచు తాను కలిగియున్నదంతా ఆ ఒక్క నాణెమేననగా, తానెన్నో సంవత్సరములనుండి చూడని బంగారు నాణెమది అని ఆమె చెప్పెను. అటువంటి నాణెమును అనేక సంవత్సరముల క్రిందట పంజాబులో చూచితినని చెప్పెను. తన జేబులోని బంగారు నాణెము ఎట్లు వచ్చునని. అది రాగి నాణెమైయుండవచ్చును గాని అది బంగారు నాణెము కాకపోవచ్చునని వాదించెను. అది నిశ్చయముగా బంగారు నాణెము. తన జేబులోనికి ఎట్లు వచ్చెనో చెప్పలేకపోయెను గాని ఈ విధముగా దేవుడు ఆ దినమున తన అక్కరలను తీర్చెను. సహో. భక్తసింగ్ తన వ్యవసాయ శిక్షణ సమయములో వివిధ పొలములలో పనిచేసి, దున్నవలసి ఉండెను. పని ఉదయము 4 గం॥లకు ప్రారంభమై రాత్రి 8గం॥ల వరకు కొనసాగుచుండెను. అంతకు మునుపు తానెప్పుడు కష్టపడి పనిచేయలేదు కాని తన పనిని కాపాడు కొనవలసియుండెను. ఒక దినమున తాను ఎంతో అలసిపోయి యుండెను. కాళ్ళు చేతులు ఎంతో నొప్పిగా నుండెను. మరియు పనిపూర్తిచేయుటకు ఇంకను నాలుగు గంటలుండెను. అందుకతడు, "ఓ ప్రభువా ! దయచేసి ఈ పనిచేయుటకు నాకు శక్తినిమ్ము. లేదా యంత్రము

పనిచేయకుండా విరగగొట్టుము" అని ప్రార్థించగా ప్రభువు ఆ యంత్రమును పనిచేయకుండునట్లు విరగగొట్టెను. ఆ యంత్రము తిరిగి పనిచేయువరకు అక్కడున్న పనివారందరికి నాలుగు రోజులు సెలవు దొరికెను. సహో.భక్తసింగ్‌కు సాక్ష్యము పంచుకొని, దైవ వర్తమానముల నిచ్చుటకు ప్రభువు తరుణములిచ్చుచుండెను. వర్తమానమునిచ్చుటకు తన జీవితములో ఒక్కసారి మాత్రమే నోట్సుతయారు చేసికొనెను. ఒకసారి అతడు ఒక ఉన్నత పాఠశాల లో మాట్లాడుటకు ఆహ్వానించబడగా ఆ విద్యార్థులు తన ప్రసంగము విని నవ్వెదరేమోనని జాగ్రత్తగా 12 పుటల నోట్సు తయారు చేసికొని, వారికి మంచివర్తమాన మివ్వగలనను ధైర్యముతో వెళ్లెను. మూడు పుటల నోట్సును వరుసగాచదివెను. మూడు పుటలపిమ్మట అకస్మాత్తుగా తొమ్మిదవ పుటకువచ్చెను అది ఎట్లు జరిగెనో తనకు తెలియదు, భయముతో వణకుచు నాలుగవపుటను వెదకెను, గాని కనిపించలేదు. కావున కాగితములన్నింటిని జేబులో పెట్టుకొని సామాన్యమైన మాటలు చెప్పుటకు మొదలుపెట్టెను. ఆ దినమునుండి ఎప్పుడును నోట్సుసిద్ధము చేసికొనలేదు. అప్పటి నుండి వాక్య పరిచర్య నిమిత్తము **"ప్రభువా ! నన్ను ఖాళీ చేయుము, నా తలంపులు, నా ఆలోచనలను తీసివేసి నీ ఆలోచనలిమ్ము నా పెదవులను, నా నాలుకను, ముట్టుము,"** అని ప్రార్థించెను. ఈ ప్రార్థనకు జవాబిచ్చుటలో దేవుడెన్నడునూ తప్పిపోలేదు. ఆ దినములలో సహో.భక్తసింగ్ పశ్చిమ దేశము నుండి

వ్యవసాయ, యాంత్రిక ఇంజనీరింగ్‌లో శిక్షణను పొందిన మొట్టమొదటి భారతీయుడు. బహిరంగముగా మాట్లాడుట యందు, బోధించుటయందు తనకున్న హద్దుబాటులను గ్రహించినవాడై, భారతదేశమునకు వెళ్ళి, ఉద్యోగము చేసి డబ్బు సంపాదించి తన సంపాదనతో భారతదేశములోని దేవునిపనికి సహాయము చేయవలెనను కొనెను. తాను వాంకోవర్‌లో ఉన్నపుడు చిన్న గుంపుగానున్న యౌవనస్థుల మధ్య మాట్లాడుటకు ఆహ్వానించబడెను. ఆ గుంపులో ఒక యౌవనస్థుడు సహో.భక్తసింగ్‌తో, "దయచేసి భారతదేశము లోని క్రైస్తవ పనిని గురించి కొన్ని విషయములు చెప్పుము" అని అడిగెను. అతడు ఆ అంశము పై మాట్లాడెను గాని మిషనరీలలో నున్న లోపములు, వారు చేయు పనిలో నున్న లోపములను గురించి విస్తారముగా వివరించెను. అతడు తన గదికి తిరిగి వచ్చినప్పుడు ఆ రాత్రి ప్రార్థించ లేకపోయెను. ప్రభువు అతనితో ఇట్లనెను. "నా సేవకులలో తప్పులు వెదకుటకు నీవెవరవు? నీ విషయమేమి? ఆ పనిని నీవు ఎందుకు చేయకూడదు? అందుకు ప్రత్యుత్తరముగా సహో.భక్తసింగ్ "ప్రభువా! బహిరంగముగా మాట్లాడుటకు నాకు ఎటువంటి అర్హతలు లేవు. ఇందువలన నీ సేవకు నా జీతమును సమర్పించుటకు తడబడుచున్నాను. నా డబ్బంతటిని నీ సేవ కొరకిచ్చెదను" అని చెప్పెను. అయితే ప్రభువు అతనితో "నీ డబ్బు నాకవసరము లేదు. నీవే నాకు కావలెను" అని చెప్పెను. అప్పుడు సహో.భక్తసింగ్ ప్రభువుతో

"నాకెన్నో హద్దు బాటులున్నప్పటికిని నిన్ను సేవించుటకు, నీవు నన్ను ఎక్కడకు పంపినను అక్కడకు వెళ్ళుటకు సిద్ధముగానున్నాను" అనెను ఆ ఉదయమున అతడు మోకాళ్ళూని, క్షమాపణ అడిగి **ఓ ప్రభువా! నీవు నన్ను అంగీకరించెదవా? నేను ఎక్కడికైనను భారతదేశమునకు గాని, చైనాకుగాని, ఆఫ్రికాకుగాని వెళ్ళుటకు సిద్ధముగా ఉన్నాను. నీ కొరకు నా స్నేహితులను, బంధువులను, సమస్తములను విడిచిపెట్టెదను** అని చెప్పెను.

### మోకాళ్ళపై సహో. భక్తసింగ్

ఇది జరిగిన తర్వాత 1932వ సంవత్సరము ఏప్రిల్ నాలుగవ తేది ఉదయము 2:30 ని॥లప్పుడు సహో. భక్తసింగ్ తన జీవితమును సంపూర్ణముగా ప్రభువునకు అప్పగించుకొనెను. అట్లు తన్నుతాను ప్రభువునకు సమర్పించుకొనిన పిమ్మట, ప్రభువు యొక్క మెల్లని, చిన్నని స్వరము, "నేను మూడు షరతుల మీద నిన్ను నా సేవకు అంగీకరించెదను. అని చెప్పెను.

1. పంజాబులోని నీ తండ్రి ఆస్తిలో నీకు వచ్చు భాగమును వదుల కొనవలెను. వస్తు సంబంధమైన లేక ఆర్థిక అవసరముల కొరకు ఏ వ్యక్తికి ఉత్తరము ద్వారా గాని, ఎటువంటి సూచన ద్వారా గాని చెప్పకూడదు. నాకు మాత్రమే చెప్పవలెను

2. నేను నిన్ను ఎచ్చటికి పంపెదనో అచ్చటికి వెళ్ళవలెను.

ఏ సంస్థలో చేరవద్దు. అందరిని సమానముగా సేవించుము.

3. నీ స్వంత ప్రణాళికలను వేసికొనకుము. దినదినము నేను నిన్ను నడిపించునట్లు నాకు అవకాశమిమ్ము. సహో. భక్తసింగ్ "ప్రభువా ! నేను అంగీకరించుచున్నాన"ని సమాధానమిచ్చెను. అంతటితో ఆ విషయము స్థిరపడెను. 1933 సం॥ ఫిబ్రవరి 6వ తేదిన సహో. భక్తసింగ్ కెనడా వదలి పెట్టి ముంబాయికి బయలుదేరెను.

### గేట్‌వే ఆఫ్ ఇండియా

సహో. భక్తసింగ్ కొన్ని నెలల క్రిందట తన తండ్రికి తన మారు మనస్సును గురించి వ్రాసెను. అదే సమయములో బైబిలు నుండి అనేక వచనములను వివరించెను. తన కుమారుడు నిజమైన ఒప్పుదలతోనే మారెనని తండ్రి ఒప్పింపబడెను. కనుక తన మార్పును గురించి ఏ అభ్యంతరము లేదని కుమారునికి వ్రాసెను. సహో. భక్తసింగ్ 1933సం॥ఏప్రిల్ 6వ తేదిన ముంబాయికి చేరుకొనెను. అతని తల్లిదండ్రులు ఆనంద బాష్పములతో అతనిని ఆహ్వానించిరి. తన కుమారుని కలిసికొని సంతోషముతో తండ్రి సహో. భక్తసింగ్‌ను ఒక ప్రక్కకు తీసుకొని వెళ్ళి. "ఏ మతమును వెంబడించవలెనో నిర్ణయించుకొను వయస్సు నీకున్నది నీవు క్రైస్తవుడవైనందున నాకు ఏ మాత్రము అభ్యంతరము లేదు. కాని నీవు మాతో కలసి సర్గోదాలోనున్నప్పు యేసుప్రభునందున్న నీ విశ్వాసమును

రహస్యముగా ఉంచవలెను. ఇదే నా కోరిక” అని చెప్పెను “యేసు ప్రభువు నాకు జీవము ఆయనను తృణీకరించి ఎంతమాత్రము జీవించలేను. ఎవరైనను తమముక్కు మూసికొని జీవించగలరా? యేసుప్రభువు నా ఊపిరి. నేను నా జీవితమంత ఆయన సేవకు ఇచ్చితిని” అని చెప్పెను. దీనిని విని ఎంతో విభ్రాంతి నొంది. తన కుమారుడు క్రీస్తును వెంబడించుట మాత్రమే గాక సంపూర్ణ బోధకుడగా మారెనని, ఇంకను కలవరపడి “నీవు కొద్ది కాలమైనను ఉద్యోగము చేసిన, నీవు చేయు త్యాగము గొప్పదని ప్రజలు గ్రహించెదరు. నీవు ఇంటికి పెద్ద కుమారుడవు, మిగిలిన వారు నీకంటె చిన్నవారు. నిన్ను మంచి ఉద్యోగము చేసి నీ తమ్ముళ్ళను చెల్లెండ్రను చదివించుటకు సహాయపడుము” అని చెప్పెను సహో. భక్తసింగ్ తండ్రి కోర్టుకేసులో ఆస్థిని, డబ్బును పోగొట్టుకొనినను, అది దేవునిదృష్టిలో లోకములోనున్న సర్వము కంటెమిన్నయని చెప్పెను. దానికి మించి ప్రభువేతన తల్లిదండ్రులను, పిల్లలను భద్రపరచి వారి అక్కరలన్ని తీర్చగలడని చెప్పెను. ప్రభువు కృపను బట్టి తన ఐదుగురు తమ్ముళ్ళు, ముగ్గురు సహోదరీలు చదువులు పూర్తి చేసికొని మంచి ఉద్యోగములను సంపాదించుకొనిరి. నిజముగా ప్రభువు సహో. భక్తసింగ్ విశ్వాసమును ఘనపరచెను. ఒక తమ్ముడు శ్రీచంద్ ఛాబ్ర ఢీల్లీ మున్సిపల్ కమిటీ ప్రసిడెంటుగా ఉండి భారతదేశములో మెచ్చుకోనదగిన సాంఘీక సేవచేసి, పద్మశ్రీ అను బిరుదును కూడ పొందెను.

### తండ్రి తన టర్బన్ తీసి కుమారుని పాదముల యొద్ద ఉంచుట

ప్రభువు పట్ల తనకు గల అచంచల, ప్రగాఢమైన సమర్పణను బట్టి కొద్దికాలము కూడా తన విశ్వాసము విషము మౌనముగా నుండుటకు నిరాకరించినప్పుడు తండ్రి గుండె బ్రద్ధలయ్యెను. చివరి ప్రయత్నముగా ఎంతో తెగింపుతో తన తలపాగాను తీసి కుమారుని కాళ్ళ యొద్దనుంచి, మనస్సు మార్చుకొనుమని వేడుకొనెను. కుమారునితో పాటు ఇంటికి తీసికొని వెళ్ళుటకు దీనత్వముతో తండ్రి ఏమైనను చేయుటకు సిద్ధముగా నుండెను. ఇప్పటి వరకు తల్లిదండ్రులు మాత్రమే సహో. భక్తసింగ్ మారు మనస్సు గురించి ఎరిగియుండిరి. వారు ఈ విషయమును ఎవరితోను పంచుకొనలేదు. ఎందుకనగా భారతదేశములో ఉన్నత కులమైన సిక్కులు, హిందువులు, క్రైస్తవేతరులు తమ కుటుంబములో ఒకరు క్రైస్తవులుగా మారుట, కుటుంబ గౌరవమునకు అప్రతిష్టయని భావింతురు. సహో. భక్తసింగ్ తన యొద్దనున్న కొద్ది డబ్బును తన తల్లిదండ్రుల పై నున్న గౌరవమును బట్టి వారికిచ్చెను. వారు అతనిని అచ్చట విడిచిపెట్టి రైలు బండిలో ప్రయాణమై పోయిరి.

### రైలు బండి వెళ్ళుచుండగా సహో. భక్తసింగ్ గమనించుట

కన్నీరు తుడుచుకునుచూ సహో. భక్తసింగ్ రైలు బండి కనుమరుగగు వరకు ప్లాట్ ఫారమ్ పై నిలుచుండెను.

తనకు నివశించుటకు ఇల్లులేదు. చేతిలో డబ్బులేదు. తల్లిదండ్రులు కూడా విడిపోయిరి. అయినను సహో.భక్తసింగ్ ప్రభువు వైపు దృష్టి నుంచి **"నా తల్లిదండ్రులు నన్ను విడచినను యెహోవా నన్ను చేరదీయును"** అను దేవుని వాక్యమును జ్ఞాపకము చేసికొని ధైర్యము తెచ్చుకొనెను. తల్లిదండ్రులు విడిచిపెట్టి వెళ్ళిన పిమ్మట సహో.భక్తసింగ్ ఆ రాత్రి ఒక సత్రములో బసచేసెను. ఉచితముగా వసతి దొరికిన ఆ సత్రములో ఒక వారముండి ముంబాయి నగరములో కరపత్రములు పంచిపెట్టనారంభించెను.

## కరపత్రములు పంచుట

ప్రభువును గురించి వినుటకు ఆసక్తి గలవారు కొందరు అతనికి ఒక కప్పు టీ ఇచ్చెడివారు. కొన్నిసార్లు ఆ కప్పు టీ మాత్రమే దినమంతటికి ఆహారముగా నుండెను. కొన్ని దినములు పిమ్మట సహో.భక్తసింగ్‌కు స్కాట్లాండ్‌లో పరిచయమైన ఒక మిషనరీ స్త్రీని ప్రభువు జ్ఞాపకము చేసెను. ఆమె భర్త ముంబాయిలోని విల్సన్ కళాశాలలో ప్రొఫెసర్‌గా పనిచేయుచున్నాడని చెప్పియుండెను. సహో.భక్తసింగ్ అది జ్ఞాపకము చేసికొని అతనిని కలిసికొనుటకు వెళ్ళెను. అప్పుడతడు స్కాట్లాండు వెళ్ళియుండెను. గాని అదే సమయములో ఇంకొక మిషనరీని సహో భక్తసింగ్ కలిసికొనెను. అతని సహాయము ద్వారా సహో.భక్తసింగ్‌కు ముంబాయిలో బైకుల్లలోని రాబిన్‌సన్ మెమోరియల్ చర్చిలో

వసతి దొరికెను. ఇట్లు ఆశ్చర్యకరమైన రీతిగా ప్రభువు అతని అవసరములను తీర్చెను. ఈ మిషనరీ సహాయము ద్వారా ప్రభువు సహో.భక్తసింగ్‌కు పంజాబ్‌లోని సియాల్ కోట్ కూటములకు ద్వారము తెరచెను.

## ఊడ్చువారి మధ్య

సహో.భక్తసింగ్ కరాచీలో వీధులు ఊడ్చువారి మధ్య పని చేయుట ప్రారంభించెను. వారిలో అనేకులు రక్షింపబడిరి. తరువాత సహో.భక్తసింగ్ వారి మధ్యలో ఉదయము 4 గం॥లకు బైబిలు పఠనము, ప్రార్ధనా కూటముల నారంభించెను. వారు నాలుగు గంటలకే ఊడ్చుటకు వెళ్ళవలెను. గనుక వారు తమ బుట్టలతోను. చీపుర కట్లతోను వచ్చి మోకరించి, పంజాబీ పాటలు పాడెడివారు. వీరి సహాయముతో సహో.భక్తసింగ్ రోజుకు రెండుసార్లు కరాచీలోని వివిధప్రాంతములలో బహిరంగ సువార్త చేయనారంభించెను. సహో.భక్తసింగ్ యొక్క సహోదరి కరాచిలో నివసించుచుండెను. తన సహోదరుడు పాకీ వారితోకలిసి బహిరంగసువార్త చేయుచున్నాడని తెలిసికొని బహుగా కోపించి, ఆమె తన బంధువులందరిని పిలిచి తన సహోదరుని గద్దించెను. మరియు యేసుక్రీస్తు ప్రభువును ఆమె విరోధముగా మాటలాడగా, వారి తండ్రి, "నీవు యేసుక్రీస్తు ప్రభువును గురించి ఏ మాత్రమును ఎరుగవు. కనుక ఆయనకు విరోధముగా మాటలాడుటకు నీకు ఏ

విధమైన హక్కులేదు. నీవు నీ సహోదరునికి వ్యతిరేకముగా మాటలాడుము, **క్రీస్తుకు విరోధముగా మాటలాడవద్దు"** అని ఆమెతో చెప్పెను. అచ్చటికి వచ్చిన వారందరు ఇది విని ఆశ్చర్యపడి వెళ్ళిపోయిరి, కూటము అంతమయ్యెను, మరుసటి దినమున సహో. భక్తసింగ్ ఒక చర్చి కూడికకు హాజరయ్యెను. తరువాత సహో. బక్తసింగ్ ఒక సిక్కుమతస్థుని కలిసికొనెను. అతనిని ప్రభువులోనికి నడిపించు అధికృతను పొందెను. ఆ వ్యక్తి తాను ప్రభువును ఎరిగిన సంగతిని సహో భక్తసింగ్ తండ్రితో పంచుకొనగా, సహో. భక్తసింగ్ తండ్రి ఆ వ్యక్తితో ఈలాగు చెప్పెను "నేను నా కుమారుని ముంబాయిలో విడచి పెట్టినపుడు చాలా దుఃఖములో నుంటిని. శాంతి పొందుటకు ఏమి చేయవలెనని సాధువులను,సన్యాసులను అడుగగా శాంతి పొందుట చాలా కష్టమని చెప్పిరి.

## చర్చిభవనము

ఒక ఆదివారమున లాహోరులో సహో. భక్తసింగ్ తండ్రి ఒక చర్చి ప్రక్కనుండి వెళ్ళుచున్నప్పుడు కూడిక ప్రారంభము కానైయుండగా లోపలికి వెళ్ళి వెనుక కూర్చుండెను. ఆ కూడిక ప్రారంభమైనప్పుడు ఒక గొప్ప వెలుగును చూచి **"ఓ ప్రభువా నీవు నాకుకూడా రక్షకుడవు"** అనిచెప్పెను. అతడు ఆ విధముగా చెప్పినపుడు అతని హృదయములోనికి గొప్ప సంతోషము వచ్చెను. కరాచి విడచి వెళ్ళుటకు ముందు సహో భక్తసింగ్ తండ్రి "నీవు ఎప్పుడైనను ఇంటికి రావచ్చునని చెప్పెను. గనుక అతడు ఇంటికి వెళ్ళెను. సహో. భక్తసింగ్ స్నేహితులు, బంధువులు అతనిని చూచుటకు వచ్చి ఉదయము నుండి సాయంత్రము వరకు అతనికి విరోధముగా మాటలాడినను అతడు మౌనముగానుండెను. తరువాత "నా సాక్ష్యమును ఈ ఊరి చర్చిలో ఎందుకు పంచుకొనకూడదు"? అనెను. క్రొత్తగా నిర్మించిన చర్చి భవనములో కూటము జరిగెను. అన్ని తరగతుల ప్రజలు అచ్చటచేరిరి. లోపల, బయట ప్రజలు క్రిక్కిరిసి యుండిరి. సహో. భక్తసింగ్ తన సాక్ష్యమును పంచుకొనెను. ఆ కూటము అయినవెంటనే అనేకులు అతని చుట్టుముట్టిరి. "నిన్ను మేము కొన్నిప్రశ్నలు అడుగవలెన"నిరి అందుకు సహో. భక్తసింగ్ అంగీకరించెను. "నీ చదువుకు రూ. 25000/- ఖర్చుపెట్టి నీ తల్లిదండ్రులకు అవిధేయతను చూపమని నీ మతము చెప్పుచున్నదా? నీవు క్రైస్తవుడుగా మారుటకు ముందు నీ తల్లిదండ్రుల అనుమతిని పొందితివా? హృదయము బ్రద్ధలైయున్న నీ తండ్రిని చూడుము. దీనిని నీవు ప్రేమ అని పిలిచెదవా? అని ప్రశ్నించిరి. సహో. భక్తసింగ్ సమాధానము చెప్పబోవుచుండగా, తన తండ్రి పెద్ద స్వరముతో "నా హృదయమేమి బ్రద్ధలు కాలేదు. నన్ను నా పేరును అనవసరముగా ఎందుకు ప్రస్తావించెదరు? నా కుమారునికి సమాధానము కలిగియున్నామని చెప్పగలరా? నా కుమారునికి నిజమైన సమాధానమున్నదని నేనెరుగుదును. ఈ సమాధానమున్నవారు దయచేసి ముందుకు రావచ్చును.

ఈ పరలోక సమాధానము పొందని వారు ఇక మీదట ఒక్క ప్రశ్న అడుగుటకు కూడ నేను సమ్మతించను" అని చెప్పెను. ఈ మాటలు వినిన వారు సహో.భక్తసింగ్ వైపు, అతని తండ్రివైపు తేరి చూచుచు ఒకరి తరువాత ఒకరు వెళ్ళిపోయిరి. 1945 సం॥ డిశంబరు మాసములో సహో.భక్తసింగ్ తన తండ్రికి తానే స్వయముగా బాప్తిస్మమిచ్చు ఆధిక్యతను పొందెను. అతడు చిరునవ్వుతో తన తండ్రిని **"సహోదరుడా"** అని పిలిచి తానే బాప్తిస్మమిచ్చిన ఆ దినమును అతి సంతోషకమైన దినము.

1933 సం॥లో కరాచిలో సహో.భక్తసింగ్ అతని జతపనివారు వీధులలోనికి వెళ్ళి సువార్తలను అమ్ముచు, కరపత్రములను పంచుచుండిరి. ఒక దినమున సహో.భక్తసింగ్, లేఖరాజ్ అను వ్యక్తికి కరపత్రిక నివ్వగా అతడు సహో.భక్తసింగ్‌తో "మాకెందుకు ఈ పత్రికని చ్చెదరు.మొదట మీ క్రైస్తవుల యొద్దకు వెళ్ళి వారిని మార్చుము. మీరు మా కంటే ఏ విషయములలో మంచివారు? మాకు శాంతిలేదు. మీకు శాంతి లేదు. మేము సిగరెట్లు త్రాగుదుము, మీరు సిగరెట్లు త్రాగుదురు. మేము సినిమాలకు వెళ్ళెదము మీరు సినిమాలకు వెళ్ళుదురు. మేము పోట్లాడుదుము, మీరు పోట్లాడుదురు. కాబట్టి మాకంటే మీరు మంచివారమని ఎట్లు చెప్పగలరు? కరాచి మొత్తములో ఒక మంచి క్రైస్తవుని చూపించుము నేను ఈ దినమే క్రైస్తవునిగా మారెదనని సవాలు చేసెను. ఎంత గొప్ప సవాలు! ఆ

సమయములో 18 వేల కంటె ఎక్కువ మంది క్రైస్తవులు కరాచిలో ఉండిరి. వారిలో 5వేల మంది ప్రొటెస్టెంట్లు. 13వేల మంది క్యాథలిక్కులు, లోకాశలతో నిండిన ఈ పట్టణములో నిజమైన క్రైస్తవుని ఎట్లు చూపించగలడు? అయితే ఇది సహో.భక్తసింగ్‌కు గొప్ప ప్రార్ధనా భారము నిచ్చెను. ప్రతి బుధవారము సముద్రపు ఒడ్డున ఉపవాసముండి ప్రార్ధన చేసెను. "ఓ ప్రభువా ఈ వ్యక్తి ఆ విధముగా సవాలు చేసెను. నాకు నీవు జవాబు దయచేయుము" అని ప్రార్ధన చేసెను. ఈ విధముగా జతపనివారితో కలసి 1937వ సం॥ వరకు రెండు మూడు సం॥లు ప్రార్ధన చేసెను.1936 నుండి సహో.భక్తసింగ్ ఏ డినామినేషన్‌లో చేరక స్వచ్ఛంద సువార్తికుడిగా పనిచేసెను. ప్రభువు అతనిని అద్భుతమైన రీతిగా నడిపించెను. మరియు అనేకఆత్మలు రక్షింపబడెను.

## లేచి ప్రార్థించుట

1936వ సం॥ జనవరి మాసమున సహో.భక్తసింగ్ 32 సం॥ల వయస్సులోనున్నప్పుడు పంజాబ్‌లో అమృత్‌సర్‌కు ఉత్తరమునున్న పఠాన్‌కోర్ అను స్థలమునకు చిన్న కూడికలు జరిపించుటకు ఆహ్వానించబడెను. దినమునకు ఐదు కూడికలు కలిగియున్నందున ఎంతో అలసిపోయి తన గదికివచ్చెను అతడు ప్రార్థించుటకు కూడా శక్తి లేనంతగా అలసిపోయెను. వెంటనే నిద్రించవలెనని ఆశించెను. గాని పరుండిన ఒకగంటకు తలుపు తట్టిన శబ్దము

మరియు **"లేచి ప్రార్థించుము"** అను స్వరము వినెను. ఈ విధముగా నాలుగైదు దినములు ప్రతిరాత్రి సంభవించెను. సహో. భక్తసింగ్ అక్కడకు వచ్చినప్పుడు స్థానిక పాస్టర్ సోహన్‌లాల్ జోసఫ్ అతనిని ఆహ్వానించెను. ఈ కూటములకు ఎంతో మంది హాజరగుచున్నందున అందరికి అనుకూలముగా ఒక పాఠశాల ఆవరణములో కూటములు ఏర్పాటు చేసిరి. అనేకులు వర్తమానము వినుటకు ఏ మాత్రము ఆసక్తి లేనివారుగా ఉండిరి. అంతేగాక కూటము జరుగుచుండగా కొందరు ప్రాగత్రాగుచు, నవ్వుచు, వెక్కిరించుచు, మరికొందరు గుంపులు గుంపులుగా చేరి హేళన చేయుచు మాటలాడు చుండిరి. వారిని క్రమపరచి, నిశ్శబ్దము గావించుట కష్టమయ్యెను. ఆ పెద్ద గుంపుకు వాక్యము పట్ల శ్రద్ధలేదు. సహో. భక్తసింగ్‌కు ఏమి చేయవలెనో తోచలేదు. ఇంతకు ముందెన్నడును తన పరిచర్యలో ఇటువంటి వ్యతిరేకతలను, అపహాస్యమును చూడలేదు. జూన్ మాసము 8వ తేదీనుండి 14వ తేది వరకు అతడు ఎంతో వేదనతో ప్రార్థించెను. అతడు ఒక రాత్రి కూడా నిద్రపోకుండ ఉపవాసముండి ప్రార్థించెను. తానెవరితోను మాట్లడలేదు. **"ప్రభువా! ఈ ప్రజలను కనికరించు"** మని మాత్రమే దేవుని ప్రార్థించెను. సహో. భక్తసింగ్ 14వ తేది రాత్రి భోదించుచు "ఇది నా చివరి కూటము. మరుసటి దినమున నేను వెళ్ళి పోవుచున్నాను" అని చెప్పి దయచేసి ప్రార్ధనకు అందరు నిలవబడవలెనని మనవి చేసెను. అందరును ప్రార్ధనకు లేచి నిలువబడిరి.

సహో. భక్తసింగ్ ప్రార్థించుచుండగా ముందు నిలువబడిన ఒక వ్యక్తి క్రిందపడెను. అతనికి తేలు కుట్టినదేమో అని సహో. భక్తసింగ్ అనుకొనెను. అంతటితో ఆగక రెండవవాడు, మూడవవాడు, నాలుగవవాడు క్రిందపడిరి. అచ్చటనున్న ప్రజలందరు నేలమీద దొర్లుచు, వెంట్రుకలు లాగుకొనుచు, రొమ్ములు కొట్టుకొని బిగ్గరగా **"ఓ ప్రభువా! నన్ను కరుణించుము నేను ఘోరపాపిని"** అని ఏడ్చుచుండిరి. ఈ విధముగా దాదాపు నాలుగైదు గంటలు కొనసాగెను.

**జెహోవా షమ్మా**

పిమ్మట వందలాది ప్రజలు కూడుకొనుటకు అనుకూలముగా నుండునట్లు ప్రభువు వారికి ఒక పెద్ద ఆవరణము నిచ్చెను దానికి **జెహోవా షమ్మా** అని పేరు పెట్టిరి. వారు 1941వ సం॥ జులై 12వ తేదిన అందులో ప్రవేశించిరి. అది అద్దెకు తీసికొనిన స్థలము నెలకు రూ.145/- అద్దె చెల్లించుచుండిరి. అప్పటిలో అది పెద్ద మొత్తము. సహో. భక్తసింగ్ ఎన్నడును డబ్బు కొరకు ఏ ప్రకటన చేయలేదు. సూచన ఇవ్వలేదు, ఆదివారమును కూడా రక్షణలేనివారు కానుక తీసికొని రాకూడదని చెప్పెడివారు. కనుక అద్దె నిమిత్తము సహో. భక్తసింగ్ జతపనివారు కేవలము ప్రభువు మీదనే ఆధారపడిరి. వారు హగ్గయి 2:8లో ప్రభువు వారికిచ్చిన వాగ్దానమును నమ్మిరి. ప్రభువు వారి అక్కరలన్నింటిని ఆశ్చర్య రీతిగా తీర్చెను. ఒక పర్యాయము

బిల్లులు చెల్లించుటకు డబ్బు అవసరమైనది. ఓడలో పనిచేయుచున్న ఒక సహోదరి చెన్నై నుండి సింగపూర్‌కు వెళ్ళుచు మార్గములో తుఫానులో చిక్కుకొనెను. ఆమెను ఆ తుఫాను నుండి తప్పించి, సింగపూర్ నుండి చెన్నైకి క్షేమముగా చేర్చినయెడల తన ఆభరణములనమ్మి దేవుని పనికిచ్చెదనని వాగ్దానము చేసెను. తరువాత సింగపూర్ నుండి చెన్నైకి ప్రయాణముచేయుచున్నప్పుడు ప్రభువు ఆమెకు తాను చేసిన వాగ్దానమును జ్ఞాపకము చేసి, ఆ డబ్బును సహో.భక్తసింగ్ కు ఇవ్వమని చెప్పెను. అయితే ఆ సమయములో సహో.భక్తసింగ్ ఎక్కడ ఉన్నాడో తెలియదు. ఆమె క్షేమముగా చెన్నై చేరిన తరువాత, సహో.భక్తసింగ్ ఉన్న స్థలమును కనుగొని డబ్బుఉన్న ఒక కవరు ఇచ్చెను. మరియు ఆమె వెళ్ళకమునుపు ప్రార్థన చేయించుకొని పోయెను. ఆమె వెళ్ళిన తరువాత ఆ కవరు విప్పి చూడగా అందులో రూ.1500/-లు ఉండెను ఆ దినములలో అది చాలా పెద్ద మొత్తము. మరొక సందర్భమునందు ప్రత్యేక కూడికల నిమిత్తము ఒక హాలును అద్దెకు తీసికొనుటకై రూ.335/-లు అవసరమైయుండెను. వారు ఎవరికి ఏ సూచన ఇవ్వక ప్రార్థన చేయుచుండిరి. మూడు దినముల తరువాత సహో.భక్తసింగ్ రూ.335/-లు మనియార్డరు, దానితో పాటు ఒక ఉత్తరము వచ్చెను. ఆ వుత్తరములో "నా చిన్న కుమార్తె రెండువారములు తీవ్రమైన జబ్బుతో స్పృహలేక ఉండెను. ఆమెకు స్పృహ వచ్చి కండ్లు తెరచిన వెంటనే నాన్నా! సహో.భక్తసింగ్‌కు కొంత

డబ్బును పంపుము" అనెను అందుకు నేను "అమ్మా మన యెద్ద డబ్బులేదుగదా" అనిచెప్పితిని. అప్పుడామె తనమెడలోని బంగారు గొలుసు తీసి దీనిని అమ్మి వచ్చిన డబ్బును సహో.భక్తసింగ్‌కుపంపుము అని చెప్పగా నేను ఆ బంగారు గొలుసును అమ్మి మీకు డబ్బు పంపుచున్నాను" అని వ్రాసెను. ఇట్లు అద్భుతమైన విధానములో ప్రభువు వారి ప్రతిఅక్కర తీర్చుచుండెను.

**జెహోవా షమ్మాలోని పెద్దలు మరియు దైవసేవకులు**

ప్రభువు సహో.భక్తసింగ్‌కు నమ్మకస్థులైన జతపనివారిని యిచ్చెను. మరియు సమర్పణతో కూడినపెద్దలను ప్రభువు కొరకు పెద్దలుగా ప్రత్యేకపరచిరి.

**జతపనివారైన సహోదరులు ఫ్లాక్, డానియల్‌స్మిత్‌తో**

ప్రభువు కృపలో విదేశీ మిషనరీలను కూడా అతనికి జతపనివారిగా ఇచ్చెను. వారిలో సహో.ఫ్లాక్ మరియు సహో డానియల్‌స్మిత్ ఉండిరి.

**సహో గోల్స్‌వర్ది**

సహో. సి.ఆర్.గోల్స్‌వర్ది మరియొక నమ్మకమైన జతపనివాడు. ఈ సహోదరులందరు వారి భార్యలతో కలసి భారతదేశములో అనేక సంఘములలో నమ్మకముగా ప్రయాసపడిరి. ఈ సంఘములు క్రొత్త నిబంధన సంఘముల నమూనాతో నుండెను. వాటిలో సభ్యత్వముగాని, సభ్యత్వపు రుసుముగాని లేదు. తిరిగి జన్మించిన వారందరు

సహవాసమునకు ఆహ్వానించబడిరి. ఆదివారము ఆరాధనా కూటములో సహోదర, సహోదరిలు వ్యక్తిగతముగా, క్రమముగా అందరికి వినబడునట్లు ఆరాధించిరి (1 కొరంథీ 14:16) ప్రతి ఆదివారము ప్రభువుబల్లను కలిగియుండిరి (అపో.కా. 20:7) పరిశుద్ధులు (రక్షింపబడినవారు) మాత్రమే దశమ భాగములనర్పించు అధికృత కలిగియుండిరి. ప్రభువు చేత సంపూర్ణసేవకు పిలువబడినవారు వారి ఉద్యోగములకు రాజీనామా ఇచ్చి సంపూర్ణసేవకు వచ్చుచుండిరి. వారు తమఅక్కరల నిమిత్తము విశ్వాసముతో ప్రభువు పై ఆధారపడిరి. సమర్పణ సమర్పణ కలిగిన దైవసేవకులు, ఆత్మీయఎదుగదల గల సహోదరులు వాక్యపరిచర్యలో సహాయపడిరి. అందరు సహోదర, సహోదరీలని పిలువబడిరి. వాక్యమునకు విరోధముగా రెవరెండు, రైట్ రెవరెండు, బిషప్ అను ఏ బిరుదులు లేవు (అపో.కా. 6:3, 19:17, 2పేతురు 3:15, కీర్తన 111:9) కూటములలో అందరు నేలపై కూర్చుండిరి ఆరాధించునప్పుడు ప్రార్థించునప్పుడు మోకరించిరి. విశ్వాసులందరు సువార్త ప్రకటించుటలో చురుకుగా పాలుపొందిరి. వివిధ ప్రాంతములలో చెదరియున్న విశ్వాసులు సహవాసము కలిగియుండునట్లు ప్రభువు సహో. భక్తసింగ్‌ను పరిశుద్ధ సమాజ కూటములు కలిగియుండుటకు నడిపించెను. మొదటి పరిశుద్ధ సమాజకూటము 1942 సం॥ డిశంబరు 6 నండి జనవరి 2 వరకు జరిగెను. వెయ్యి మందికంటెఎక్కువ పాల్గొనిరి.

## ప్రేమ విందు

పరిశుద్ధ సమాజ కూటములలో ఆహార వసతులు ఉచితముగా ఇవ్వబడెను. వందలాదిప్రజలు రక్షింపబడు చుండిరి. విశ్వాసలు పురికొల్పబడిరి. ఇంత పెద్ద సమాజ కూటములలో కూడా అవసరము తీర్చబడుటకు సహో. భక్తసింగ్ ప్రభువు మీదనే ఆధారపడెను.

## హెబ్రోను

ప్రభువు సహో. భక్తసింగ్‌తో "ఈ స్థలమును తీసికొనుము ఇది ప్రపంచమంతట జరుగు ప్రభువుపనికొరకు" అని చెప్పెను. అప్పుడు సహో. భక్తసింగ్ ఒప్పుకొని ఆ స్థలమును హెబ్రోను అను పేరు పెట్టెను.

## సహపనివారు

ప్రభువు అతనికి భారతీయులను మరియు విదేశీయులను తనతో పని చేయుటకు నమ్మకమైన సహపనివారినిచ్చెను.

## జతపనివారు

సహో. అబ్బిస్ అతని భార్య కలసి చిన్న పిల్లల మధ్య విరామ బైబిలు బైబిల్ పాఠశాలలను ప్రారంభించిరి. ప్రతి సంవత్సరము వేల కొలది పిల్లలు హాజరై అనేకులు రక్షింపబడి, ప్రభువు నందు బలమునొందిరి, అట్లు రక్షింప బడిన వారిలో అనేకులుఇప్పుడు సంపూర్ణ సేవలోనున్నారు.

## ఊరేగింపు

వి.బి.యస్. చివరి దినమున ఇరుగు పొరుగు

ప్రాంతములలో సువార్త ప్రకటించుచు ఊరేగింపుగా వెళ్ళుదురు.

## హెబ్రోను పెద్దలు

జతపనివారుగానున్న వారిలో అనేకులు హెబ్రోను సంఘమునకు పెద్దలుగా అభిషేకించబడిరి. సహోదరులు యం.యన్ యేసురత్నం, సి.ఇ.దాసన్, కె.యన్. అగస్టిన్ మరియు డా॥వి.యస్ పాల్ వీరి సహకారము ద్వారా హెబ్రోను సంఘము వర్ధిల్లెను. సహో.భక్తసింగ్‌కు హెబ్రోను అంతర్జాతీయముగా ముఖ్యస్థావరమయ్యెను. అతడు ఒక చిన్న గదిలో నివశించుచుండెను. తన సమయమంతయు మోకాళ్ళని వాక్యము చదువుటయందును. ప్రపంచములోని పరిశుద్ధులందరి కొరకు ప్రార్థించుట యందును గడిపెను.

## పరిశుద్ధ సమాజ కూటములు

హెబ్రోను ప్రతి సంవత్సరము జరుపబడిన పరిశుద్ధ సమాజ కూడికలకు భారతదేశమంతటి నుండి వేలకొలది విశ్వాసులు వచ్చుచుండిరి. సహో.భక్తసింగ్ అగ్నివంటి వర్తమానములందించుచుండెను. అతడు ఇంగ్లీషులో బోధించుచుండగా తెలుగు, హిందీ భాషలలో తర్జుమా చేయుబడెను. అనేక వందల ప్రజలు రక్షింపబడుచుండిరి. అనేకులు మృతమైన క్రైస్తవశాఖ (డినామినేషన్) ల నుండి విడిపించబడి నూతన నిబంధనలోనున్న సంఘనమూనాను తెలిసికొనిరి. అనేక మంది సంపూర్ణసేవ నిమిత్తము పిలుపును విని సమర్పించుకొనిరి. ఎల్లప్పుడు ఉదయకాలపు కుటుంబ ప్రార్థనలయందు సహో.భక్తసింగ్ ప్రసంగించెను. బలమైన వాక్యపరిచర్య జరుగుటద్వారా ఉదయకాలమున పరలోకము దిగివచ్చుటను విశ్వాసులు అనుభవించిరి.

## సహో.భక్తసింగ్ ప్రార్థించుట

వివిధ కార్యక్రమములు సక్రమముగా జరుగునట్లు సహో.భక్తసింగ్ మోకాళ్ళపై ప్రార్థించుచుండెను. రాత్రింబవళ్ళు ప్రార్థనలోను పలువిధములైన పరిచర్యలలోను ప్రయాసపడుచుండెను.

## సహోదరులు ఆహారము వడ్డించుట

దేవుని సేవకులు ఆహారమును వడ్డించు అధికృతను కలిగియుండిరి. ఆరంభదినములలో సహో.ఫిలిప్పు, సహో.లాజర్ సేన్‌లు ఆహారము వడ్డించు పరిచర్య చేసిరి.

## బాప్తిస్మములు

పరిశుద్ధ సమాజ కూటములలో రక్షింపబడిన వందలాది విశ్వాసులు (కొన్ని పర్యాయములు 500 నుండి 600 మంది) నీటి బాప్తిస్మమునందు సాక్ష్యమిచ్చిరి. ఈ పరిచర్య ముగియువరకు కొన్ని గంటలు సమాజము ఎడతెగక పాటలు పాడుచుండగా సహో.భక్తసింగ్ నిలుచుండెడివాడు.

## సమాజ కూడికల ఊరేగింపు

సమాజ కూడికలలో రెండవ శనివారము అందరును కలసి పాటలు పాడుచు, సువార్తను ప్రకటించుచు,

ఊరేగింపుగా వెళ్ళుచుండిరి. సహో.భక్తసింగ్, ఆరోగ్యము అనుమతించినంతవరకు పరిశుద్ధులతో పాటు తాను కూడా ఊరేగింపులో నడుచుచుండెను

## క్యాలింపాంగ్ పెద్దలు

1974వ సం॥ ఒక చిన్న గృహము నందు ప్రభువు తన సాక్ష్యమును స్థిరపరచుటకు సహో.జోర్డన్‌ఖాన్‌ను వాడుకొనెను. తరువాత సహో,భక్‌సింగ్ దర్శించగా ఆ పర్వత ప్రాంతములందు పరిచర్య అగ్నిజ్వాలవలె ప్రజ్వరిల్లి వ్యాపించెను. తమ నమ్మకత్వమును బట్టి ప్రార్థన సహకారమును బట్టి పరిచర్యలో ప్రారంభములో ప్రయాసపడిన వారిని పెద్దలుగా అభిషేకించుటకు ప్రభువు సహో.భక్తసింగ్‌ను నడిపించెను. హైదరాబాద్‌లోని హెబ్రోనులో జరిగినట్లు అహ్మదాబాద్, చెన్నై, ఖరగ్‌పూర్, క్యాలింపాంగ్‌లలో పరిశుద్ధ సమాజకూటములు జరుపబడెను. భారతదేశము నుండి సహో.భక్తసింగ్‌ను ప్రభువు ఐరోపా, ఆస్ట్రేలియా, ఆఫ్రికా, అమెరికా ఖండములలో అనేక ప్రదేశములకు తీసికొని వెళ్ళెను.

## డా॥బిల్లీగ్రహామ్‌తో

అమెరికా దేశమునకు వెళ్ళినపుడు సహో.భక్తసింగ్, డా॥బిల్లీగ్రహామ్‌ను కలిసికొనెను. ప్రతి పరిచర్య నిమిత్తము సహో.భక్తసింగ్ దేవుని చిత్తమును కనుగొనెను. ప్రార్థించి, దేవుని చిత్తము నిశ్చయము చేసికొనునంతవరకు అతడు ఒక్క అడుగుకూడ వేయలేదు. ఈ క్రింది వచనములు అతని స్వంత అనుభవముగానుండెను. **"యేసు వారిని చూచి-నన్ను పంపినవాని చిత్తము నెరవేర్చుటయు ఆయనపని తుదముట్టించుటయు నాకు ఆహారమై యున్నది"** (యోహాను 4:34)

**"...నన్ను పంపిన వాని చిత్త ప్రకారము చేయగోరుదును గాని నా యిష్ట ప్రకారము చేయగోరను"** (యోహాను 5:30)

సహో.భక్తసింగ్ ప్రయాస ఫలితముగా అనేక దేశములలో సజీవ సంఘములున్నవి, వావున సహో.భక్తసింగ్ ఇండియాలోని స్థానిక సంఘములకు తండ్రివంటివాడని పేర్కొనబడెను.

సహో.భక్తసింగ్ దాదాపు 60 సం॥లు ప్రభువును నమ్మకముగా సేవించెను. 1985 నుండి ఆరోగ్యము క్షీణించెను. మరియు చివరి ఐదు సంవత్సరములు పడక మీద నుండెను. అతడు 2000 సం॥ సెప్టెంబరు నెల 17 తేది తెల్లవారు జామున మహిమలోనికి చేర్చబడెను. ఆ ఉదయము హైదరాబాదునందు భూమికంపించెను.

**సమాధిపెట్టె :** సమాధి పెట్టెను హెబ్రోను నుండి బయటకు తెచ్చినపుడు

**ఇంద్రధనుస్సు :** సహో.భక్తసింగ్ తన 98వ యేట ప్రభువు సన్నిధికి చేరుకున్నారు. ఆయన జీవించిన చివరి సంవత్సరాలలో ఆయన పార్కిసన్ అనే వ్యాధితోను, ఇతర వృద్ధాప్య అశక్తతలతోను బాధపడ్డారు. అంతటి అనారోగ్యంలో

కూడా, ఆయనకంఠములో శక్తి వున్నంతవరకు దేవుని మహిమ పరచడం మానలేదు. క్రైస్తవేతరుడైన ఆయన బంధువొకడు సహో.భక్తసింగ్‌ను సందర్శించినప్పుడు "నీవు నమ్ముకున్న దేవుడు ఇటువంటి రోగాన్ని నీకు ఎందుకురానిచ్చాడు?" అని ప్రశ్నించగా ఆయన ఒకమాటతో సూటిగా సమాధానం చెప్పాడు. అది "పరిపూర్ణత" ప్రభువు నాకు ఎంతోమేలు చేస్తున్నాడు....ఇది మాత్రం మట్టి శరీరమే" అని ఆయన తరచుగా అంటూవుండేవారు. సహో.భక్తసింగ్ నివాసస్థలం పేరు "హెబ్రోను" అదే ఆయన ప్రధాన కార్యస్థానం కూడా. అక్కడ ప్రతి ఆదివారం పెద్ద సంఖ్యలో ప్రజలు ఆరాధనకు హాజరవుతారు. వారంలోని ఇతర సేవాకార్యక్రమాలు కూడా ఇక్కడ జరుగుతాయి. హెబ్రోను హైదరాబాద్‌లోని గొల్కొండ క్రాస్‌రోడ్స్ వద్ద వున్నది. సహో.భక్తసింగ్ ఆదివారం నాడు మరణించారు. ఆయన భూస్థాపన శుక్రవారం జరిగింది. ఆ 5 రోజులలోనూ దాదాపు 6 లక్షల మంది హెబ్రోనుకు వచ్చి ఆయనకు శ్రద్ధాంజలి ఘటించారు. ఆయన అంతిమ సంస్కారం ఒకదైవిక ప్రత్యేకత. పరలోకమే దిగివచ్చి ఒక క్రొత్త సంఘటన భూమిమీద జరిపిస్తుందా అనిపించింది. ఆయన శవపేటికను హెబ్రోను నుండి ఉదయం 11 గం॥లకు ఊరేగింపుగా "నారాయణగూడ క్రైస్తవ సమాధి స్థలానికి" తీసుకొని వెళ్ళి దాదాపు మధ్యాహ్నం 2గంటలకు భూస్థాపితం చేస్తారని ప్రకటించారు. వెళ్ళవలసిన దూరం దాదాపు 3కి.మీ. హెబ్రోనులో వున్న పెద్ద ఆవరణ, అనుబంధించివున్న

హెర్మోను స్థలం, చుట్టుప్రక్కలవున్న అన్నిఆవరణలు, రోడ్లు ప్రజా సందోహంతో క్రిక్కిరిసిపోయాయి. భౌతికకాయాన్ని చూడడమే కాదు, కనీసం కదలడానికి కూడా స్థలం లేదు. ఎక్కడ చూసినా త్రోసుకువస్తున్న జనసందోహం, శవపేటికను తరలించవలసిన సమయం వచ్చింది. అంతలో ఒక అద్భుతం జరిగింది. ప్రజలలో ఏదో ఒకఆకస్మిక కదలిక, చాలామంది ఆకాశంవైపు చూశారు. అక్కడ ఒకమహాద్భుతం. ఆ రోజు వాతావరణం వేడిగానే వుంది. అప్పటికి సూర్యుడు హెబ్రోను నడినెత్తికి వచ్చాడు. అంతలో ప్రజలలో నుండి కేకలు వినిపించాయి. "అదిగో చూడండి. ఆశ్చర్యంగావుంది. ఒక ఇంద్రధనుస్సు సూర్యుని చుట్టూవచ్చింది. చూడండి. చూడండి" అన్న కేకలు సహో.భక్తసింగ్ భౌతికకాయాన్ని హెబ్రోను వెలుపలికి తరలిస్తున్నప్పుడు మరొక అద్భుతం జరిగింది. పెద్దపావురాలగుంపు అకస్మాత్తుగా ఆకాశంలోకిలేచి హెబ్రోను ఆవరణ చుట్టూ వీడ్కోలు ఇస్తున్నట్లుగా తిరిగాయి. ఈ రెండు సంఘటనలు అందరిని ఆశ్చర్యచకితులను చేశాయి. **"యెహోవా భక్తుల మరణం ఆయన దృష్టికి విలువగలది"** అని (కీర్తనలు 116:15) లో చెప్పిన విషయాన్ని బహుశా ప్రభువు మనకు జ్ఞాపకం చేశాడేమో. అంతిమయాత్రలో అనేకులు పాల్గొన్నారు. ఎక్కడ చూసినా త్రోసుకువస్తున్న జనసందోహం. ఈ మహాప్రజా వాహినిని నియంత్రించడానికి పోలీసులు చాలాకష్టపడ్డారు. ఈ దారంతా

మామూలురాకపోకలు స్థంభించాయి. క్రైస్తవ సహోదరు లందరూ తమ తమ సాంప్రదాయక అవలంబనలను, విభాగ విభేదాలను మరిచి పాల్గొనడం విశేషం. నగరాలు, పట్టణాలు, గ్రామాల నుండి అమెరికా, ఇంగ్లాండు, చైనా, స్విట్జర్లాండు. జర్మనీ, ఆస్ట్రేలియా, భూటాన్, నేపాల్ వంటి ఇతర దేశాల నుండి స్త్రీలు, పురుషులు, పిల్లలు పెద్ద సంఖ్యలో వచ్చారు. క్రీస్తులో తన సహోదరుడైన ప్రియతమ భక్తసింగ్‌కు తమ హృదయపూర్వక వీడ్కోలు ఇచ్చారు. ఎవరైనా రాజకీయ నాయకుడు మరణించినపుడు ప్రజలు హాజరవుతారు. కాని ఎక్కువమంది స్థానికులు, ఇతరుల వుండటం పరిపాటి. కుటుంబ సభ్యులు తప్ప మరెవ్వరూ ప్రేమాభిమానాలతో ఆ శవాన్ని వెంబడించరు. అయితే సహో.భక్తసింగ్ గారి విషయంలో స్త్రీలేమిటి, పురుషులేమిటి ప్రతివారు. తమ స్వంత ఖర్చులతో దూర ప్రాంతాలనుండి వచ్చారు. నిద్రాహారాలను కూడా లెక్కచేయలేదు. దైవకుటుంబంలో ఒక ఆత్మీయతండ్రిగా పరిగణించే ప్రియతమ నాయకునికి కడసారి వీడ్కోలు చెప్పడానికి వచ్చిన జనసందోహం అది. ఒక అంచనాప్రకారం దాదాపు 2 లక్షల మంది కంటే ఎక్కువమంది హెబ్రోను నుండి శవపేటికవెంట నడిచారు. ఆ ఊరేగింపును ఇంటి పైకప్పుల మీదనుండి చెట్లపై నుండి కార్యాలయ భవనాలనుండి వందలాదిమంది చూసారు. ఎందరో దైవజనులు తమ చేతులలో బైబిలు పట్టుకొని సువార్త సునాదాలతో శవపేటికను వెంబడించారు. క్రైస్తవ నిరీక్షణలో మిళితమైన ఆ కన్నీటి వీడ్కోలు ప్రతి ఒక్కరినీ దిగ్భ్రాంతి పరచింది. భక్తసింగ్ గారి సోదరులలో ఒకరు ఢిల్లీ నుంచి వచ్చారు. భక్తసింగ్ గారి పట్ల విశ్వాస సమాజంలో వున్న ఈ ప్రేమను, అభిమానాన్ని చూచి ఆయన ఇలా అన్నారు. "నా సోదరుడు ఇంతటి ప్రేమకు పాత్రుడయ్యాడని నేను ఊహించలేదు" శవపేటిక వెంట ఊరేగింపుగా వస్తున్న జనసందోహంతో పాటు తన చుట్టూ ఏర్పడిన రంగుల ఇంద్రధనుస్సుతో పాటు సూర్యుడు కూడా ప్రేమతో వెంబడిస్తున్నాడా అని అనిపించింది. సమాధి పూర్తి అయ్యేంతవరకు ఆ సూర్యవలయం అలాగే నిలిచివుంది.

## మా ప్రచురణలు

1. విలియమ్ కాల్లేట్ జీవిత చరిత్ర
2. మారిన విషపు మనిషి జీవిత చరిత్ర
3. నికోల జేమ్స్ ఊయిచీచ్ జీవిత చరిత్ర
4. మారిన మాంత్రికుడు (యం.రాజారావు)
5. సహో. భక్తసింగ్
6. మేరీ జోన్స్ జీవిత చరిత్ర
7. మారిన ముస్లిమ్ సోదరుడు షేక్ మఖ్బుల్
8. నాల్గవ జ్ఞాని
9. మదర్ థెరిస్సా జీవిత చరిత్ర
10. గ్రాహం స్టైయిన్ జీవిత చరిత్ర
11. పండిత రమాబాయి జీవిత చరిత్ర
12. చార్లెస్ జి.ఫిన్నీ జీవిత చరిత్ర
13. బాంబులు పట్టిన చేతిలో బైబిలు

Start

Gospel Haking



want to work with our network




rewards



Spread Gospel to India



IND Gospel Family

sent your Details to

gospelneedsindia@gmail.com

www.gospelneeds.com